# సూర్యుడు కూడా ఉదయిస్తాడు

కవితా సంపుటి



విశ్వనాథ సూర్యనారాయణ
జయప్రభ



ప్రచురణ



రిజిస్టరు నెం. 1/64

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాద్-500003

# SURYUDU KOODA UDAYISTADU

Anthology of Poetry By

Viswantha Suryanarayana and Jayaprabha



యువభారతి

ప్రచురణ : 68

ప్రథమ ముద్రణ

12 డిసెంబరు '1980

ప్రతులు : 1,000

ముఖచిత్రం : శీలా వీర్రాజు

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్

హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :

గీతా ఆర్ట్ ప్రింటర్స్

హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాద్-500003

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు

తిలక్‌రోడ్డు, హైదరాబాదు-500001.

వెల : రూ. 6/-

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
ఆర్థిక సహాయంతో ప్రచురించబడినది




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారత కడచిన పదిహేడేళ్లగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 67 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకున్నది.

భారత దేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో దాదాపు 7,000 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 725 మంది, భారతీ భూషణులుగా 70 మంది చేరారు.

ఉదుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు:
యువభారతి

హైదరాబాద్.
12-12-1980



# మా మాట

యువభారతి ప్రచురిస్తున్న మరో వచన కవితా సంకలనం ఇది. మా యువభారతి సభ్యులు శ్రీ విశ్వనాథ సూర్యనారాయణ, వారి సతీమణి శ్రీమతి జయప్రభ గారలు వ్రాసిన వచనకవితలు ఇందులో ఉన్నవి. తమ మనస్సులను ఉత్సాహంతో నింపిన తలపులను, తమను ఆలోచనా ధీనులుగా జేసిన జీవిత సమస్యలను నలుగురికీ తెలుపాలనే ప్రయత్నం ఈ కవితల్లో కని పిస్తున్నది. ఎవరికో ఏ కొందరికో నచ్చిన విధంగా రచనలు వెలువడాలనే కాలం కాదిది. తమకు నచ్చిన భావాలను ప్రకటించుకునే స్వేచ్ఛ పౌరునికి ఉంది. కవులు కూడా పౌరులే. అయితే ఒకడు వెలిబుచ్చిన భావాలతో మరొకడు ఏకీభవించాలని కానీ, నలుగురికీ నచ్చిన భావం ఒకనికి నచ్చితీరాలని కానీ నియమం చేయలేము. కొందరు శక్తిమంతంగా చెప్పవచ్చు. కొందరు హేతుబద్ధంగా చెప్పవచ్చు. కొందరు అందంగా చెప్పవచ్చు. కొందరు ఏమి నగిషీలు లేకుండా చెప్పవచ్చు. ఆ చెప్పుకునే స్వాతంత్ర్యం మాత్రం ఉండాలి. దానికి ప్రోత్సాహం కూడా ఉండాలి. సూర్యనారాయణ జయప్రభ గారలు తమ భావాలను వచన కవితలుగా మలచి అందించాలని ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నం ఒక ప్రయోగమే కాని ఆశయం కాదని వాళ్ల నమ్మకం. ముందుముందు మంచి రచయితలు కావడానికి ఈ నమ్మకంచాలు. ఈ నమ్మకంలో వినయం స్ఫురిస్తున్నది.

వీ రిద్దరు మా యువభారతి సంస్థకు సభ్యులు. మేము నిర్వహిస్తున్న కార్యక్రమాలను జయప్రదం చేయడంలో సహకరిస్తున్న వాళ్లు. వీరి కవితా సంకలనం "సూర్యుడు కూడా ఉదయిస్తాడు" మా యువభారతి ప్రచురణగా రావడం మా కెంతో ఆనందాన్ని కలిగిస్తున్నది.

ఈ ఇద్దరి యువ భారతీయుల కవితాసంకలనానికి "కవితాసూర్య-ప్రభ" రూపంలో ఆశీస్సుల నందించి, ప్రోత్సహించిన మహాకవి డా॥ దాశరథి గారికి మా ధన్యవాదాలు. పాఠకుల ఆశీస్సులూ ప్రోత్సాహం వీళ్లకు ఇతోధికంగా లభిస్తుందని ఆశిస్తున్నాం.

హైదరాబాదు
12-12-80

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు
యువభారతి

# యువభారతి సాహిత్య సమావేశాలు

సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతర సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో గడచిన పదహారు సంవత్సరాలుగా కృషి చేస్తున్న సంస్థ 'యువభారతి'. మనిషిలో అంతర్లీనంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కావడానికి యువభారతి ప్రతినెలా మొదటి, మూడు ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో సాయంత్రం 5 నుండి 8 గంటలవరకూ సాహితీ సమావేశాలు నిర్వహిస్తున్నది. ఈ సమావేశాలకు సహృదయులందరూ ఆహ్వానితులే!

కవితా

# సూర్య-ప్రభ

కళాప్రపూర్ణ

## డాక్టర్ దాశరథి

(ఆస్థానకవి)

ఇద్దరు యువకవులు ఈ మధ్య సాక్షాత్కరించారు. వారు పార్వతీ-పరమేశ్వరులా ? వాగర్థాలా? సూర్య-ప్రభలా? అంటే వారు సూర్య-ప్రభలే. ఒకరు యువకవి విశ్వనాథ సూర్యనారాయణ. మరొకరు వారి జీవిత భాగస్వామిని యువకవయిత్రి జయప్రభ. వారిని సూర్య-ప్రభ అంటే బాగుంటుందనిపించింది. వీరిరువురూ ఒకే కవితా సంపుటిలో రెండు భాగాలు. ఒకే నాణేనికి రెండు ప్రక్కలు. ఒకే శీర్షికను పంచుకున్నవారు.

అదే —''సూర్యుడుకూడా ఉదయిస్తాడు'' అన్న శీర్షిక. ఈ శీర్షిక ఎన్నో ప్రశ్నలను ప్రభవింప జేసింది. ''సూర్యుడు ఉదయించడం సహజం. ఇందులో ఏమిటి విశేషం?'' అనుకుంటాడు పాఠకుడు శీర్షిక చూడగానే. అక్కడే చమత్కారం వుంది.

''మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళుతున్నాను'' అని ఒక కవితను ముప్పై ఏండ్లనాడు నేను వ్రాశాను. ''మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్ళాలేమిటి ? లక్షల మంది కనిపిస్తుంటేను'' అన్నారు కొందరు. కాని ఆలోచనాలోచనాలు కలవారు, -మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్ళే మనిషి ఒకడు ఉన్నాడని సంతోషించారు. మేలుకోడానికీ మేల్కొడానికీ తేడా వుంది సుమా !

అలాగే ''సూర్యుడు కూడా ఉదయిస్తాడు'' అన్న శీర్షికలో, కొత్తదనమేమి ఉంది చెప్మా ? అనిపిస్తూనే ఆలోచనలో పడేస్తుంది పాఠకులను.

ఈ యువ కవి దంపతులు ఏ సూర్యుణ్ణి గురించి చెబుతున్నారు? ఏ ఉదయాన్ని గురించి చెబుతున్నారు? అని ప్రశ్నలు వేసుకున్నప్పుడు మన కళ్ళ ముందు ప్రశ్నల తోరణాలు, ఆ తోరణాల వెనుకగల కారణాలు గోచరిస్తాయి.

అశాంతితో, అజ్ఞానంతో, అనారోగ్యంతో, ఆకలితో అలమటించి పోతున్న లోకం, గాఢాంధకార బంధుర భయంకర కాళరాత్రి. ఈ రాత్రిలో చుక్కలు సైతం ఉదయించడానికి జడుస్తున్నాయి. చంద్రుణ్ణి ఎప్పుడో కబళించింది ఈ కాళరాత్రి.

ఈ కాళరాత్రి తెల్లవారాలి. సూర్యుడు ఉదయించాలి. ఈ యువకవి దంపతులు కోరుకునే జ్ఞానసూర్యుడు ఉదయిస్తాడా ఏ నాటికైనా ? ఈ ప్రశ్నకు సమాధానం ఈ ప్రశ్నలోనే వుంది.

ఉదయిస్తాడని ఉద్ఘోషిస్తున్నారు ఈ ఉభయులు. కాళరాత్రిని బొమ్మకట్టి చూపిస్తున్నారు తమ కలాల్లోని కారునలుపు సిరాతో. మమతలు, సమతలు నశించిన ఈ లోకం కాళరాత్రి కాక మరేమిటి ?

''వెలుతురు కత్తులు పడతాను'' అంటున్నాడు సూర్యనారాయణ.

''ఈ యుద్ధంలో చస్తే
వెలుతురు కత్తినై పుడతాను''

అంటున్నాడు సూర్యనారాయణ. ఈ కవి సార్థక నామధేయుడు !

''పాములకు పగవారు
చీమలకు చిరకాల మిత్రులు'' కావాలి ఈ కవిసూర్యుడికి.

నిర్బలుల, దుర్బలుల వైపు ఈ కవిసూర్యుడి మొగ్గు కనిపిస్తున్నది.

రవి చూడలేనివి ఈ కవి చూడడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈయన కవీ, రవీ కూడా.

''ఈ దేశానికి గుండె ఎక్కడ ?
పొట్ట కనిపిస్తోంది'' అంటున్నాడు.

పొట్ట కనిపిస్తున్న మాట వాస్తవం. ఆకలితో అలమటించే అనంతకోటి అనాథలు పొట్ట చేత్తో పట్టుకుని పట్టణాల్లో, పల్లెల్లో తిరుగుతున్నారు.

మరి గుండె ఎక్కడుంది ?

గుండె- కవిసూర్యుని కరంలో, కలంలో వుంది. అందుకే ఆ గుండెలో నుంచి పుంఖాను పుంఖంగా ప్రజా గీతాలు వెలువడుతున్నాయి. ఈ గీతాలకు ఛందస్సు లేదు, రాగం లేదు, తాళం లేదు, పల్లవి లేదు. ఇది ప్రజాపయోనిధి తరంగ ఘోష.

ఈ గీతాల్లో ఉన్నవల్లా సంకేతాలు.

సూర్యనారాయణుడు తాండవం చేస్తున్నాడు శివుడిలా. ప్రభ లాస్యం చేస్తున్నది పార్వతిలా.

నిశా వితర్దిక. చేతిలో కరదీపిక.

"చైతన్యపు తూరుపులా ప్రజ్వరిల్లు" అంటున్నది ప్రభ. "రగులుతున్న ఆవేశాన్ని ఆరనీయకు" అంటున్నది ప్రభ.

"బిగిసిన నీ పిడికిలి మాటునే
సూర్యుడు కూడా ఉదయిస్తాడు" అనే ఆశా వాక్యం, వేదవాక్యంలా పలుకుతున్నది ప్రభ.

'గూండాతనం' 'నల్లధనం'-ఇవి చీకటికి సంకేతాలు.

'కనువిప్పు కలిగితే గాని
వెలుగు కనపడదు' అంటుంది ప్రభ. అవును. మనోనేత్రోన్మీలన మహా సవన కవన ప్రభ ఈ కవయిత్రి.

"ఛాందసాన్ని గర్హించడమే కాదు నా ధ్యేయం
సమతత్వానికి నాంది కావడం నా ఆశయం;
ఈ సమరంలో రాలినా ఓడిపోను నేను
మరో జ్యోతిగా మరు నిముషంలో అవతరిస్తాను." అంటున్నది కవయిత్రి జయప్రభ.

"ఈ యుద్ధంలో చస్తే
వెలుతురు కత్తినై పుడతాను" అన్నాడు కవి సూర్యనారాయణ.

"ఈ సమరంలో రాలినా...
మరో జ్యోతిగా అవతరిస్తాను" అంటున్నది ప్రభ. వెరసి సూర్యప్రభ! ఈ సూర్యప్రభ మానవ హృదయాల్లోని భయంకర కాళరాత్రికి ఉదయాన్ని ప్రసాదించాలి.

"పుచ్చిపోయిన చచ్చు[illegible]కాల చీకట్లను
చీల్చుకుంటూ నిలిచి[illegible]
జ్వలిస్తూ! ప్రజ్వలిస్తూ[illegible] అంటున్నది ప్రభ.

ఈ జ్వలనం ఉన్ననాడే నిజమైన కవనం ఉద్భవిస్తుంది.

ఈ యువకవి దంపతుల కవితలు చదువుతుంటే వీరి కవితల్లో Urgent sense of social protest సాక్షాత్కరిస్తుంది.

వీరి కవితల్లోని భావనా సంవిధానం, రచనాచాతుర్యం పాఠకులను మంత్రముగ్ధుల్ని చేస్తాయి.

కత్తుల తోటల్లో పూలగుత్తులు, పూలగుత్తుల గుండెల్లో కత్తులు వీరి కవితలు.

ప్రభ తన కవితలు వినిపిస్తున్నది. నేనూ, సూర్యనారాయణుడూ వింటున్నాం. యెన్నెటి కలలు కంటున్నాం. ఆమెలో ఎంతటి ఆవేశం! ఆమె కవితలో ఎటువంటి ఆదేశం! ఆమె మాటల్లో ఎంతశక్తి!

"Words are fields of energy."

ఉదయాలు రెండు రకాలని చెప్పారు సూఫీ తత్త్వవేత్తలు.

ఒకటి-సుబెహె కాజిబ్-అనగా, అసత్య సూర్యోదయం

రెండవది-సుబెహె సాదిఖ్-అనగా, సత్య సూర్యోదయం

ఈ యువకవి దంపతి, సూర్య-ప్రభ, లోకానిక సాక్షాత్కరింపజేయ దలచినది సత్య సూర్యోదయం.

సమర తిమిరాలు నశించి సమతా కుసుమాలు హసించి లోకాన్ని నాకం చేయగల "సూర్యుడుకూడా ఉదయిస్తాడు" అని విశ్వసిస్తున్నాను. అలాంటి సూర్య-ప్రభకు స్వాగతం.

రౌద్రి-కార్తిక-కృష్ణ-విభావరి
భాగ్యనగరి.

# వీళ్ళందరికీ....

కవిత్వాన్ని ఒక 'హాబీ' గా కాక, మా లక్ష్యానికి ఒక మార్గంగా ఎన్ను కుని, ప్రయోజనాన్ని సాధించాలనే తలంపుతో, ఈ కవితా ప్రక్రియను చేపట్టిన మాకు ఈ ''సూర్యుడు కూడా ఉదయిస్తాడు'' తొలి ప్రయత్నం—

మా ప్రయత్నానికి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడెమీ వారి ఆర్థిక సహాయం మరింత ఉత్సాహాన్నిచ్చింది. అందుకు మేం వారికి కృతజ్ఞులం-

కవితలని పరిశీలించి, తగిన సలహాలివ్వడమే కాక, ముచ్చటగా మూడు రంగుల ముఖచిత్రం వేసి ఇచ్చి సహకరించిన, శ్రీ శీలా వీర్రాజుగారికి మా నమనస్సులు—

ఈ పుస్తకాన్ని సహృదయంతో ఆమూలాగ్రంగా చదివి తక్కువ వ్యవధిలో, ముందుమాట వ్రాయడమేకాక, స్వయంగా ఆవిష్కరించి మమ్మల్ని ఎంతగానో ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవులు, డా॥ దాశరథి గారికి మా నమస్సుమాంజలులు.

వ్రాతప్రతి నుండి అచ్చుపుస్తకం అయ్యేవరకు వెంట వుండి, శీర్షికాలంకరణ గావించిన మిత్రుడు వెంకట్రావ్ (సుధామ)కు మా ధన్యవాదాలు.

అల్పవ్యవధిలో అచ్చు కార్యక్రమాన్ని చేపట్టి, అందంగా ముద్రించి యిచ్చిన శ్రీ పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, ముఖ్యంగా అధినేత శ్రీ శ్రీనివాస్ గారికి మా అభివాదాలు.

సకాలంలో బ్లాకులు తయారుచేసి అందించిన శ్రీ అశోక్ గారికి, ముఖ చిత్రాన్ని మూడు రంగుల్లో అందంగా ముద్రించిన గీతా ఆర్ట్ ప్రింటర్సు వారికి మా కృతజ్ఞతలు—

చివరగా అయినా చిన్నమాట కాదు. ప్రజల్లో సాహితీచైతన్యం పెంపొందించాలనే సదాశయంతో కృషిచేస్తున్న యువభారతి సంస్థలో సభ్యులమై, ''యువభారతి'' ప్రచురణగా ఈ పుస్తకం వెలుగు చూస్తున్నందుకు మాకు ఎంతో సంతోషంగానూ, గర్వంగానూ ఉన్నది—

**... మరోసారి మా కృతజ్ఞతాభి వందనాలు తెలుపుతూ**

శుభాకాంక్షలతో —

భవదీయులు

విశ్వనాథ సూర్యనారాయణ

జయప్రభ

హైదరాబాదు
12-12-80

# విశ్వనాథ సూర్యనారాయణ

జననం : 1952 ;సైన్సులో పట్టా పొంది,రైల్వేలో స్టేషను మాష్టరుగా ఉద్యోగం. సృజనాత్మకమైన రచనను ఏ రూపంలో వున్నా గ్రహించడం, స్ఫూర్తినిచ్చే రచనలు చేయడం, జీవితాన్ని ప్రయోజన కరంగా తీర్చిదిద్దుకోవడం - ఇవి వ్యక్తిగా నా తలపోతలు. ''కవిత్వం ప్రజలదేననీ, దాన్ని ప్రజలనుంచి దూరంచేస్తే ఎయిర్ కండిషన్డ్ గదుల్లోనో సౌండ్ ప్రూఫ్ గదుల్లోనో బంధిస్తే ఊపిరాడక చచ్చి పోతుందని'' కవిగా విశ్వాసం.

# కవితల క్రమం

# వెలుతురు కత్తులు

అదంతా అడవి
చిన్నవీ పెద్దవీ చెట్లు
సాధువూ క్రూరమూ జంతువులు
భిల్లులూ, భల్లూకాలూ కలసి పాలిస్తున్నాయి.

అడుగు వేయబోతే
అగాధంలో పడతామన్న భయం
కేక వేస్తే—
ప్రతిధ్వనించే ప్రమాదం.
కాలికింద ఎండుటాకుల ఎదలు
చిట్లిపోతున్న చప్పుడు
ఇది చీకటా ?
అయితే నా గమ్యం వెలుగు
ఇది వెలుతురా ?
అయితే నా గమ్యం శూన్యం

"జర జర" మని శబ్దం
పాములే పాకుతున్నాయో !
మొసలితనమే హెచ్చరిస్తోందో !
అసహాయ శూరుడనిపించుకున్న వాడ్ని
అసమర్థుడనవుతున్నాను.

ఇంతలో కలకలం
పిడుగులు పడ్డ చప్పుడు
అగ్ని పర్వతం బద్దలైన ధ్వని
అదొక సైన్యం -
తండోపతండాలుగా,
తరలి వస్తున్న సముద్రంలా——

ఎర్రవీరులట !
ఎదురులేని వాళ్ళట !
గుండె జండాలనెగరేసే వాళ్ళట !
పాముకు పగవారట !
చీమలకు చిరకాల మిత్రులట !
వాళ్ళ చేతులలో వెలుతురు కత్తులు
చీకటి చెట్లను
కూకటి వేళ్ళతో నరికేస్తున్నారు
స్వార్థం క్రూరమృగాల కోరలు పెరికేస్తున్నారు
చీకటిలో చిక్కుపోయిన లతలకు
ఆలంబనలవుతున్నారు.
స్వార్థం క్రింద నలిగిపోతున్న
ఎండుటాకుల ఎదలను ఆదుకుంటున్నారు.

నా కళ్ళకు జీవం వచ్చింది
అడవి అంతా కాంతివంతమయింది
అరే ! అది అడవి కాదు !
నాగరికతకు నిలయం, మహానగరం !
నా మనస్సు చైతన్యాన్ని పుంజుకుంది
నేనూ వెలుతురు కత్తిని పడతాను
ఈ యుద్ధంలో చస్తే -
వెలుతురు కత్తినై పుడతాను.

# జీవనం

నువ్వు జీవిస్తే, అది నీ సహనం
నువ్వు మరణిస్తే, అది నీ జీవనం

పుట్టేవు గాబట్టి
బ్రతికేయడం నీ లక్షణం
పుట్టకపోతే,
నువ్వు పోగొట్టుకొనేదెంత, తృణం
బ్రతికినన్నాళ్ళూ
నీ ఆరాటం సుఖజీవనం
జీవితమంతా మాత్రం దుఃఖభాజనం

నువ్వు పుట్టినప్పటి కేక
ప్రపంచ గతులను మార్చలేదు
నీ ఆఖరి నిశ్వాసం
నిశ్శబ్దాన్ని పెంచలేదు

సామాన్యుడిగా సాగించిన జీవితంలో
సాధించిన విషయాలేవీ కనపడవు
నువ్వుంటే ఎంత ? పోతే ఎంత ?
ఇంత పెద్ద సంతలో నల్లపూసంత

అయినా నువ్వు సజావుగానే పెరిగావు,
కలలవిందు భోంచేస్తూ —
శ్రమించావు, కోర్కెల మూటలు మోసుకుంటూ -
చివరికేం చేసావ్ ?
సింహావలోకనం చేసుకునే వేళకి
సీటు ఖాళీ చేసేశావ్.

# గుండె ఎక్కడ?

ఈ దేశానికి గుండె ఎక్కడ ?
పొట్ట కనిపిస్తోంది -
ఎవరూ చెప్పనక్కర లేకుండా,
చూపించనక్కర లేకుండా -
కోట్లమంది మన దేశంలో
చేత్తో పట్టుకు తిరుగుతున్నది అదే కదూ !

నోరు వినిపిస్తోంది,
నిముషానికి నంభై హాహాకారాలతో
సాచిన అరచేతులు కనిపిస్తున్నాయి
దీనంగా —
కాని, గుండె ఎక్కడ ?
కళ్ళు కనబడుతున్నాయి,
కలలు ఎండిపోయి -
కళ్ళల్లో నీళ్ల ఎండిపోయి-

ఇవేవీ నా కక్కరలేదు -
ఈ దేశం బతికుందని చెప్పేందుకు,
సాక్ష్యంగా —
చైతన్యవంతమైన గుండె ఎక్కడ ?



విశ్వనాథ సూర్యనారాయణ

# నేను కమల కలల్ని కన్నాను

నేను కమల కలల్ని కన్నాను
ఒకటి చాలా పొడుగు
భూమ్మీద నిల్చుని
నింగి లోంచి లోకాల్ని చూస్తుంది
ఆనందం ఏ మూలనున్నా అందుకుని అనుభవిస్తుంది
అందాల వనాంతర లతాంతాల నాఘ్రాణిస్తుంది
పూవుల్లోని పీయూషంలాంటి తేనెను తాగుతుంది
చంద్రుడి ముఖం మీద ముద్దుపెట్టుకుంటుంది
వోల్గా నదికి వాలుగా ఈదుతూ
నైలులో తేలుతుంది
సంతోషాన్ని చంకనేసుకుని
సమతలాల్లో తిరుగుతుంది
సుఖం దాని పరమావధి
అందుకే దానికి లేనే లేదు వ్యవధి.

రెండవ కల పీలగా వుంటుంది
చూసిన వాటినే పోల్చుకోలేదు
అన్నీ చూడడ మెక్కడ ?
అందం అంటే ఆ ముఖంలో ప్రశ్నార్థకం
చీకటి అడవిలో పోతూ,
ఇన్నింటిని దాచగల చీకటి
ఆకలిని దాచనందుకు కోపం.
కొండలు, బండలు, చెండుతున్న ఎండలు,
రుద్ధ కంఠంలోని వేదన
గుచ్చుకొనే చూపులు, చెప్తున్నాయి-
కష్టాంలోనే తన కాపురమని
కన్నీళ్ళే తన కడుపునింపునని.

# హృదయం

ఉదాత్తమైన హృదయం
ఒక ఏనుగు లాంటిది.
అందరూ ఎక్కి ఊరేగాలని
ఉవ్విళ్ళూరుతారు.

కొందరు-
సూదితో సున్నితంగా
పలకరించాలను కుంటారు.
అజ్ఞానులు-
ఆకారం చూసి భయపడతారు.
అమాయకులు–
ఆశ్చర్యాన్ని ప్రకటిస్తారు.
నలుగురు గుడ్డివాళ్ళు
నాలుగు రకాలు ఊహిస్తారు.
కొన్ని కుక్కలు వెంటబడి
వెర్రిగా మొరుగుతాయి.

అయినా, ఇవన్నీ-
హృదయాన్ని అధిగమించలేవు
ఉద్రిక్తతలు ఉద్యమించలేవు.

# పుట్టినరోజు

మనిషి పుట్టాడు,
మట్టిలోంచి-
ఆకలి పుట్టింది,
మనిషిలోంచి—
ఆశపుట్టింది,
ఆకలిలోంచి-
ఆశలోంచి
ఆలోచన పుట్టింది.
అవని అంతా ఆలోచన పాకి
మనిషిని మహోన్నతుడిని చేస్తున్నది.
మట్టిని మరిచి పొమ్మంటున్నది.

# ప్రజాధీన

కాలవృక్షం కడుపు ఫలించి
విరిసిన మరో సుమానికి,
మానవ ఆశయ జలాంతర్గామికి,
నూతన సంవత్సరానికి,
ఆగామికి స్వాగతం.

నువ్వు మంత్రివీ కావు
వీణా తంత్రివీ కావు
ఆదరంగా పలకరించడానికి
సాదరంగా పలికించడానికి.

అయినా నీ మీదున్న అభిమానం
నా చేత పలికిస్తోంది స్వాగతం
నువ్వు నా జీవితంలోనే కాదు
కోట్ల జీవరాసుల జీవితాలలో
బతకడానికి వచ్చావు.
ప్రవేశించేముందు ప్రవర్తిల్లే తీరు తెలుసుకో!

అదిగో అటుచూడు !
సాయంకాలం - సంధ్యాకాశం
రోడ్డుమీద మెత్తగా జారుతున్న కారులు
ట్రాఫిక్ సముద్రంలో లంగరువేసిన ఓడలా బాంబే బజార్
ఓడకి కట్టిన తెరచాపలుగా చీరలు

అందంగా కదుల్తున్న జంటలు
రాపిడిద్వారా చలికి దూరమవుదామనే ప్రయత్నం
పాన్ నములుతూ రక్తాన్ని ఉమ్ముతున్న జనం
చీకటి పడుతున్నా కళ్ళని వదల్లేని జోళ్ళు
శంకర్ జైకిషన్ సంగీతానికి లయవేస్తున్న వేళ్ళు
'పౌనా' లోనే పీయూషం పీలుస్తున్నవాళ్ళు
షోకేస్‌లోని అమ్మాయి కధికారమిచ్చి, నిల్చున్నకళ్ళు, కాళ్ళు
బార్‌లో బాటిల్ బార్ లేకుండా అభిషేకం చేసుకునేవాళ్ళు
మెరిసే బూట్లలో జీవితపు వెలుగు చూసుకునే వాళ్ళు
ఎంగిలి విస్తరిని ఆశగా చూస్తున్న ఆకలినోళ్ళు

వీళ్ళందర్నీ చూడు-
కార్లను, బార్లను, చీర్లను,
కళ్ళను, కాళ్ళను, ఆకళ్ళను
అన్నిటినీ చూడు.
ఈ బిజీమనుషులు,
ఈ గజిబిజి మనుషులు,
నిన్ను గుర్తించి పలకరించే స్థితిలో లేరు.
నీలాంటి వాళ్ళెందరొచ్చినా-
వీళ్ళ నసీబులు మార్చలేరు
ప్రజాధీన ప్రభుత్వం వస్తే
అప్పుడొచ్చే ఉగాదికి అదే పేరు పెట్టుకుంటారు
అందరూ పికాలై ఒకేలా కూస్తారు
మామిళ్ళై చివుళ్ళు వేస్తారు
ఉగాదికోసం ఉవ్విళ్ళూరుతారు
ఉగాదిని ఉగాదిగా చూస్తారు.

# ఎవడీతడు?

ఆహరహం అనుసంధించే ఆహం
కృష్ణాగోదావరులకు ఎడతెగని దాహం
ఆరంభంలో కనిపించే శూరత్వం
ఆఖరువరకూ పొంగిపొరలే ఉదారత్వం
శీతనగం నుండి సేతువు వరకూ
ఎక్కడికయినా ఎవరితోనయినా
కలిసి మెలిసి శోగల మానిసి
పంచెకట్టులో ప్రపంచంలోనే
ఎంచదగ్గ వాడు
ఘన చదవడంలో
ఘనమైన వాడు

వేమన్న పెట్టిన వేపాకు నమిలి నమిలి
తీయదనం సంతరించుకున్నవాడు
నన్నయ్య నుండి విశ్వనాథ వరకూ పెట్టిన
నేతి పిండి వంటలకి అజీర్తిచేసి
శ్రీ శ్రీ ని మందు పుచ్చుకున్నవాడు

అయ్యా ! ఎవడీతడు ?
అక్షరాలా ఆంధ్రుడు !



విశ్వనాథ సూర్యనారాయణ

# వీడు

ఆకాశంలోకి దూసుకుపోతూంటుంది గాలిపటం
అది చూసి, దారం చేతపట్టుకుని
దాని ప్రాణం తన చేతిలో వుందని మురిసిపోతాడు
ఏగద్దైనా వచ్చి తన్నేస్తుందని ఊహించడు

తన మీద కోపం ఇంట్లో వాళ్ళ మీద చూపిస్తాడు
ఇంటివాళ్ళపైన కోపం ఊళ్ళో ప్రదర్శిస్తాడు
తనకోపం తన శత్రువనుకోడు
ఆడదాన్ని బలహీన వర్గాల్లో చేర్చమంటాడు
అదేమని అడిగితే ఏం చెపుతాడు? బలహీనత.

గాల్లో మాటలు పుట్టిస్తాడు
నీట్లో అగ్గి రగుల్కొలుపుతాడు
మంత్రం వేసినట్లు నటించి
చింతకాయలు రాల్చేస్తాడు
ఆలోచన ఆరోగ్యాన్ని పాడు చేస్తుందంటాడు
ఆదమరచి నిద్రపోవడంలో
ఆనందం తెలుసుకోమంటాడు
కాటి వరకు శవానికి సాయం వెళ్ళి
వేదాంతం బోధిస్తూవుంటాడు
డబ్బునీ, డబ్బున్నవాళ్ళనీ తిడతాడు
ధనమూల మిదం జగత్ అంటాడు
విస్కీ తాగుతూ బీరు త్రాగేవాణ్ణి ఆక్షేపిస్తాడు
గడ్డాలు పెంచి గుడ్డలిప్పేస్తాడు
చంద్రమండలంలో మంద్రంగా నడుస్తూ
భూమిని బుట్టలో వేసేద్దామనుకుంటాడు
బతకలేనివాడి మీద ఉపన్యాసాలిచ్చి
బతికేస్తాడు-

# ఆరో భూతం

చీకటి కొండలపైన కూర్చుని
వెలుగు దేవుడి కోసం తపస్సు చేస్తుంటే
కాలం ఫక్కున నవ్వింది
రేపటి చీకటిలోకి చూపులనెగళ్ళను నెడితే
బాధ బరువుగా నిట్టూర్చింది

అజ్ఞానం సూర్యుడు అంతటా వెలుగుతున్నాడు
వేదనతప్ప, వేడిగాని, వెలుగుగాని పంచనివాడు
ఆరోభూత మవుదామనుకుంటున్నాడు
మనిషి ఆలోచనా దారాలను పట్టుకుని
కొండెక్కుతున్నాడు — కోతినవ్వుతోంది
ఆకలి దేవుడ్ని పూజించడానికి ఆకులైనా లేనందుకు
బూతులు తిడుతున్నాడు పూజారి,
పాపం ! పుణ్యం సంగతి మర్చిపోయి

తెగిన గాలిపటాన్ని
ఆకాశంలో గ్రద్దలెగరేస్తున్నాయి
ఆ మూల చీకట్లో-
దేవుడూ, చార్వాకుడూ
ఒకర్నొకరు కావలించుకుని
నిశ్శబ్దంగా ఏడుస్తున్నారు

ఆకలి కడుపులో పిల్లీ,
మెదడులో పులీ పచార్లు చేస్తున్నాయి
పుట్టినప్పటినుండి పుట్టెడు మోస్తున్న గాడిద
ఇవాళ తిరగబడింది
బరువు బట్టబయలై బజార్న పడింది

ఈ దేశం ఎద్దుపైన
పుళ్ళరుచి మరిగిన కాకులకి
ముక్కులే కాని రెక్కలు లేవు.

# భయం

ఈ ప్రభుత్వానికి-
ప్రజలు గట్టిగా నవ్వితే భయం
ఆ నవ్వే, వాళ్ళ కొంప తీస్తుందేమోనని.

ఈ దేశంలోని నాయకులకి
ప్రజల్లో ఐకమత్యం కనిపిస్తే భయం
ఆ చీమలన్నీ తమని
పాములుగా భక్షిస్తాయని.

ఇక్కడి ప్రజలకి వోటంటే భయం
గద్దను చూసే కోడిపిల్లలా,
ఏ పార్టీ ఎప్పుడెగరేసుకు పోతుందోనని

ఇక్కడి న్యాయానికి కోర్టంటే భయం
ఏ నల్లకోటు చీకట్లో
ఎవరు పీక పిసికేస్తారనో-

డబ్బున్నవాళ్ళందరికీ
ముష్టివెధవలంటే భయం-
ఎప్పుడో అప్పుడు, తమలో కలిపేసుకుంటారని.

# గోడలు-చెవులు

నాతో నేను
ముఖాముఖీ మాట్లాడుతుంటే-
నా మనసుకి గోడలు లేవు
చెవులే వున్నాయి.

నాలో నేను
ఏకాంతంలో ఏదైనా
ఏకరువు పెట్టుకుంటే
నా మనసుకి గోడలున్నా
ఆ గోడలకి చెవులున్నాయి.

పరాయి మాటలకీ
ప్లేట ఫిరాయింపు పాటలకీ
నా మనసుకి గోడలే వున్నాయి
చెవుల్లేవు.

# పట్టువదలని విక్రమార్కుడు

చీకటి శవాన్ని
ఉషః కిరణాలు మోసుకెళ్ళి
అవతల గిరవాటేసాయి

ఇంక ఈ లోకంలో దుర్గంధం లేదు
సూర్యుడు తన వెలుగులతో, వేడితో
లోకాన్ని పరిశుభ్రంగా వుంచుతాడు

అరె !
మాయమయిన చీకటి శవం
మళ్ళీ అవతరించింది.
ఇంక సూర్యుడు విక్రమార్కుడే-

# సూర్యుడు కూడా ఉదయిస్తాడు

## 1

నువ్వెంత ధైర్యంగా వున్నా
భయం ఎప్పుడూ నిన్ను ధైర్యంగా చేసుకునుంటుంది.

నువ్వెంత మెలకువగా ఉన్నా
నిన్ను నిద్ర వదలదు
నువ్వెంతగా నిద్రపోతున్నా
మెలకువ నీ చెవి మెలిపెడుతుంది

నువ్వెంతలా నవ్వుతున్నా
దుఃఖం దిగమ్రింగుతుంటావు
నువ్వు కన్నీరు మున్నీరుగా ఉన్నా
ఎక్కడో ఆనందాబ్ధిలో
మునకలు వేస్తుంటావు

నువ్వెంత చీకట్లో ఉందామనుకున్నా
సెర్చిలైట్ల సహాయానికి
సూర్యుడు కూడా ఉదయిస్తాడు.

నువ్వు చచ్చిపోదామంటే
నీకెదురుగా పెద్ద బండలా బ్రతుకు.
నువ్వు బ్రతుకుదామనుకుంటే
నీలోనే తీరని ఆశలా చావు.

# 2

నువ్వు చీకటిని చిచ్చుపెట్టి
రచ్చ కీడ్చాలనుకుంటే-
నీకు సాయం సూర్యుడు కూడా ఉదయిస్తాడు

దరిద్రపు చలికి వణికిపోతున్న జీవితాలకి
నువ్వందించే అరచేతి రాపిడి వేడికి
సూర్యుడు కూడా ఉదయిస్తాడు
వెచ్చదనం వెల్లువై ప్రవహిస్తాడు

అజ్ఞానాంధకారంలో అలమటిస్తున్నవారికి
కరదీపకవై నీవు కదులుతుంటే
కర్మసాక్షి నీ వెంట కదులుతాడు

ప్రకృతిని పరిరక్షించడానికి
నీవుచేసే ఉద్యమానికి అలంకారంగా
వనమంతా వెలుగు పందిళ్ళువేసి
**కిరణాల తోరణాలు కడతాడు సూర్యుడు.**

# అలజడి

ఆలోచనలను మేసే మెదడులో
మెదడు జరిపే నియంతృత్వంలో
నియంతృత్వానికి వణికే అవయవాలలో
అలజడి !

కార్ఖానాని పోషించే కార్మికుడిలో
కార్మికుడి చెమటను త్రాగే యంత్రాలలో
చెమట పేరు చెప్పుకుని బ్రతికే ఎయిర్ కండిషనర్లలో
ఎయిర్ కండిషనర్ ని ఎరువు వాడుకునే
కార్మిక నాయకుడి కళ్ళలో
అలజడి !

విత్తనాలు జల్లి వియత్తును చూసే రైతులో
రైతు ఇంట్లో పసివాళ్ళ కళ్ళలో
కళ్ళలో మెరిసిన మెరుపులో
మెరుపును వెంటాడిన ఉత్తుత్త ఉరుములో
ఉరుమును రానిచ్చి ఊరు చివరనే ఆగిన వానలో
వానరాని వేళ రైతు కళ్ళలో
అలజడి !

కట్టు తెంచుకోలేని సముద్రంలో
కొండ రాళ్ళకు తలలు బాదుకునే సెలయేళ్ళలో
గాలికి గుండెలు చీలిపోయే వెదుళ్ళలో
మేధను అందుకోలేకపోయిన మూగజీవాలలో
అలజడి !



విశ్వనాథ సూర్యనారాయణ

# అంతరంగిక భద్రత

ఆదిగో తోక-
ఇటు చూడండి, పొగ.
తోక కత్తిరించండి !
పొగ శిగ తరగండి !
పులిపోతే యేం ?
తోక మనచేతిలో వుంది

నిప్పులు చిమ్మితే యేం ?
నిప్పు శిగ, పొగ
మా చేతిలో వుంది

మనుషులు పోతే యేం ?
చట్టం మా చేతులో వుంది.

# నిశ్శబ్దం

ఎటు చూసినా నిశ్శబ్దం
ఎటు విన్నా నిశ్శబ్దం
నిశిలా, నగ్నంగా
అబ్ధిలా, నిండుగా నిశ్శబ్దం

నిశ్శబ్దాన్ని శాసిస్తున్న
గడియారం గంటలు
నిశ్శబ్దం కింద పడి
చితికిపోతున్న ఒంటరి క్షణాలు
నిమ్నోన్నతాలు లేని నిశ్శబ్దం
నిండుగా ప్రవహిస్తోంది

జైలుగోడ దగ్గర
సెంట్రీ చేస్తున్న శబ్దంలో నిశ్శబ్దం
కేబరేకి వేస్తున్న డ్రమ్‌బీట్స్‌లో నిశ్శబ్దం
మధ్య మధ్యన నగరమధ్యలో
మద్యం మందమందంగా ఒలుకుతున్న నిశ్శబ్దం

రేడియోలోంచి వచ్చే
నిరంతర వాహిని నిశ్శబ్దం
పత్రికలు బాకాలతో
సరఫరా చేస్తున్న నిశ్శబ్దం
ఇంత నిశ్శబ్దాన్ని పండించి, వండించి
దేశంనిండా పంచిన ప్రభుత్వం నిశ్శబ్దంగా లేదే !

హుష్ ! నిశ్శబ్దం !
ఎక్కడో - తుపాకీ పేలిన
శబ్దంలోంచి నిశ్శబ్దం.

విశ్వనాథ సూర్యనారాయణ

# ఆసుపత్రి

ప్రపంచం ఓ ఆసుపత్రి

పుట్టడమే-
ఆసుపత్రి లోకి తొలి అడుగు
మరణకాలం వరకూ మంచాలు మారడమే
మరణించినపుడే నీకు డిశ్చార్జ్.

ఈ లోపల-
స్వార్థాలు, రాజకీయాలు, ఉద్యోగాలు
సంసారాల్లాంటి రోగాలతో బాధపడాల్సిందే !
రోగాలకు, భోగాలకు
ఒక్కసారే విముక్తి
అదే నీ మరణ గడియ !

# పురిటిపాప

ఎందుకమ్మా ?
నన్నీ మాయా ఝంజాటంలో పడేశావ్
ఆశ నిరాశల పోరాటంలోకి తోశావ్
నీకు తెలీదూ మరో ప్రాణికి
నీడ ఇచ్చి పోషించాలని ?
నీకు తెలీదూ, మరో ప్రాణి
నీ ప్రాణ సంకటానికి ఉద్భవించిందని ?
తెలుసు ! నీకన్నీ తెలుసు !

తెలిసి తప్పుచెయ్యడం తెరవై పోయింది
పురిటిపాపను చూసి
పురుగును చూసినట్లు చూసే ఈ దేశంలో
పుట్టుక వద్దని పొర్లి ఏడ్చే ఈ దేశంలో
ఎందుకు కన్నావమ్మా ? ఎందుకమ్మా నేను ?

నన్నుపోనియ్యి—
ఇప్పటికైనా మించింది లేదు
ఈ క్షణమే నన్నీలోకంనుండి పంపెయ్యి
మాతృ ప్రేమ నాలో పెరగకముందే
నాపై నీ మమతానుబంధం అల్లుకోక ముందే
పురిటి పాపగానే పుడమినీ విడనీ !

మీలా కష్టాలు తింటూ కలకాలం బతకలేను
నాయకుల ఉపన్యాసాల ఎంగిలాకుల్లో
మెతుకులు వెతుక్కోలేను
పురిటిలో పోయిన పిల్లకు అప్పులు లేదు
నీవు హంతకురాలవుకావు, ప్రాణదాతవు

దేవుడికి నా ప్రాణాన్ని దానం చేసినదానవవుతావు
నన్నీ లోకంనుండి పంపెయ్యి
పురిటి పాపగానే పుడమిని విడనీ.

# టులెట్

ఈ గది నిండా -
పొగలా అలుముకున్న శూన్యం
దీన్ని తమ ఊపిరితో నింపి
ప్రాణం పోసేవాళ్ళకు, స్వాగతం !

అనంతంగా, ఎత్తుగా, ఆకాశంలా కాకపోయినా,
ఉన్న కప్పునుండి
ఎల్లప్పుడూ వర్షించే బూజుని
భరించే ఓపికా, తీసేసే తీరికా
ఉన్నవాళ్ళకు స్వాగతం !

గోడకి కలుగులా
హృదయానికి గాయంలా కనిపిస్తున్న
కిటికీనుండి కాంతిని
సమాహ్వానించేవారికి ఆహ్వానం !

విరిగిన భిక్షాపాత్ర లాంటి వీధి వాకిలిలో
చల్లని చూపుల కళ్ళాపి జల్లి
చిరునవ్వుల ముత్యాలు ముగ్గులుపెట్టే
సహృదయులకి స్వాగతం !

అద్దె ఇవ్వాలసి లేదు
ఇస్తే ఆక్షేపణ లేదు
అద్దె మాత్రమే ఇస్తే అవసరంలేదు.

# అద్దానికి అటు

కాల్లో ముల్లు గుచ్చుకుంటే
చేత్తో తీసి సుతారంగా ముద్దుపెట్టుకో
పెదవినించి కారేది రక్తంకాదు,
కరుణ అని గుర్తుంచుకో

చెంప దెబ్బ పడితే-
చేదుమందు మింగాననుకో
కందిన చెంప, కొట్టినవాడికి
అందని సందేశ మిస్తుందని తెలుసుకో
ఆకలవుతున్నా అన్నం దొరకని
అదృష్టాన్ని మెచ్చుకో
ఆకలితో కొన్నాళ్ళు బ్రతుకుతావ్
అన్నంతో ఆన్ ది స్పాట్ ఛస్తావ్

రాజకీయ నాయకుడే ఈ యుగంలో
అవతారపురుషుడని తెలుసుకో
భగవంతుడు కూడా ఎత్తలేదు
అన్ని అవతారాలు
బాబాలమీద భక్తి పెంచుకో
భజనల్లోనే భవిష్యత్తుందనుకో
ఓటు వెయ్యడమే నీ ధర్మమనుకో
ఆ పైన ఫలితం -
అవతార పురుషుడేనని నమ్మకో

కరువు కాటకాలను చూసి
కలవర పడడం మానుకో
అవి ప్రకృతి ధర్మాలని తెలుసుకో -
దేశం అంటే మనుషులనీ
మనుషులకు మాత్రం మట్టే మిగులునని తెలుసుకో -

 విశ్వనాథ సూర్యనారాయణ

# క్షమించండి

కొళాయి బొట్లు బొట్లుగా ఏడుస్తోంది
ఎలక్ట్రిక్ లైటు గుడ్డి గవ్వలా నవ్వుతోంది
ఏడ్చే దానికెందు కేడుస్తోందో తెలీనట్లే
నవ్వేదానికి నవ్వెందుకో తెలీదు పాపం!

చూసే వాళ్ళకు మాత్రం-
ఏడ్చే కొళాయిని చూసి లైటునవ్వుతూ
నవ్వేలైటుని చూసి కొళాయి ఏడుస్తూ
ఒక దాన్నొకటి ఓదార్చుకుంటున్నట్లుంది

పెట్రోలు కొలత లీటర్లలోంచి ఔన్సుల్లోకి మార్చారు
తన ఖరీదు పెరిగిందని కాలరెత్తుకుంది కిరసనాయిలు
ఆలోచనల్ని అల్పాహారంగా స్వీకరిస్తూ
ఆకలిని తీర్చుకుంటున్నారు నిరుద్యోగులు
కాలేజీ కెళ్ళడం క్వాలిఫికేషననుకునే అమ్మాయిలు
కళ్ళను కాంపౌండ్ వాల్ అవతల వదిలేస్తున్నారు
సమ్మెను సాకుగా చేసుకుని
విద్యార్థులు విరగబడి తిరుగుతున్నారు

అన్నీ చూస్తున్న సగటు జీవికి
జీవితం అంటే వెగటు కలిగి
ఆత్మని మాత్రం హత్య చేసి
శరీరాన్ని క్షమించి వదిలేస్తున్నాడు.

# ప్లస్-మైనస్

అనుభవాల పొద్దుమీద
అనుభూతుల ముద్దుపెట్టి
అందంగా వెళ్ళిపోయాడు
అందకుండా సూర్యుడు

అవకాశం చీకట్లో
అబద్ధపు వెలుగులు నింపి
సొంతమని చెప్పుకుంటూ
సొమ్ము చేసుకుంటున్నాడు చంద్రుడు

ఆవేదన అంచు తట్టి
ఆవేశం హద్దు ముట్టి
ఆహుతి అయినా చాలని
అడుగు ముందుకేశాడు
అభ్యుదయంలో మానవుడు

హద్దులన్నీ రద్దు చేసి
అవినీతినే ఆత్మ చేసి
సకలం కబళిస్తున్నాడు
సామ్యవాదం పేరుతో
సమకాలీన రాజకీయ నాయకుడు.

# దొరచిలక

దొర లేలిన దేశం మనది
దొరలేలే దేశం మనది
తెలుపైతేనేం? నలుపైతేనేం?
నల్లదనమే మూలధనం
నల్లధనమే సాధనం

అవినీతితో కలిసి
అజ్ఞాత సంతకాలు చేసి
అవనిని పాలిస్తున్నాడు
ఆనవాలు లేని గొంతు కలిపి
అసహ్యంగా పాడుతున్నాడు

అవసరాలను ఆసరాగా తీసుకుని
ఆత్మను అమ్మేసుకుని
స్వార్థ శిఖరాల కెగబ్రాకుతున్నాడు
పులివేషం అని చెప్తూనే
తనలోపలి పులిని పురిగొల్పుతున్నాడు
శ్రేయస్సు కోరుతూనే
మాయ చేస్తున్నాడు
శ్రమజీవుల కోసం నేనని చెప్తూ
శ్రమని క్రమంగా కొనేస్తున్నాడు

కోట్లప్రజల కష్టాలు గుర్తుచేస్తే
కర్మ సిద్ధాంతాన్ని కావలించుకుని ఏడుస్తాడు
స్వంత ఆస్తిని స్మరిస్తే
సర్వం మరుస్తాడు కోపంలో-

ధరలు వాటంతటవే విశ్వరూపం దాలుస్తున్నాయని
రేడియోలో, టీవీలో
అసహ్యంగా ముక్కు చీదేస్తాడు
ధరలను ధరకు రప్పించడానికి
చట్టాలు చేస్తూ ఒట్లు పెట్టుకుంటాడు
అన్ని గుళ్ళల్లోనూ పూజలు చేయిస్తాడు
అన్ని మసీదుల్లో ప్రార్థనలు చేయిస్తాడు
ప్రపంచశాంతి నెలకొంటే
ధరలు తగ్గే అవకాశం వుందంటాడు
ఈలోగా సామాన్యుడు బ్రతికే అవకాశం
అందకుండా పోయిన ఆకాశం

ఓర్మి వహించి సామాన్యుడు
ఎన్నాళ్ళు నిలుస్తాడు ?
ఒక్కనాడు పిడికిలి బిగించి
దొరగార్నీ దొరతనాన్నీ అణిచేస్తాడు
దొరగారితోపాటు
ధరలూ అణిగిపోతాయి
ధరల రాక్షసుడి ప్రాణం
దొరచిలకలో వుందిగా మరి !

# అంగారవల్లరి

అది గుడిశె
అందులో నివసించే వాళ్ళు
మనుషులనబడే మరలు
దేశాన్ని కప్పిన దారిద్ర్యపు తెరలు
పిడికెడు మెతుకులు తిని బతకడం
లగ్జరీగా భావించేవాళ్ళు

రోజంతా చాకిరీ చేయగా
కూలి అని చెప్పి ఇచ్చిన
చిల్లర డబ్బులతో
బలహీనతని త్రాగి, వాడికళ్ళు-

తాగే వెందుకని అడిగినందుకు
తన్నులు తిని, ఏడ్చి, దానికళ్ళు-

ఆకలికి పేగులంటుకుపోయి
అపస్మారకంలో వున్న
అర్భకుడి కళ్ళు-

కలిసి, ఎర్రనై,
ఎదను తొలిచే అంగార వల్లరై,
దేశం మెడలో శోభిస్తోంది.





# నీ కోసం

నీ కోసం నిందలు మొయ్యి
నీ కోసమే ఓటు వెయ్యి
నీ కోసం గెలిచిన వాళ్ళకి
అడుగుల మడుగు లొత్తు
నీ కోసం కొన్నాళ్ళు పస్తులుండు
ఆపైన పస్తులు అలవాటయిపోతాయి

నీ కోసమే నాయకులు
విదేశాల్లో విహరిస్తున్నారు
నీ కోసమే పాపం ! నాయకులు
కార్లలో శ్రమపడి తిరుగుతున్నారు

నీ కోసమేనేమో నాయకులు
మెత్తలకు ఒత్తుకుని, నీ బాధలకు
కళ్ళు ఒత్తుకుంటున్నారు
నీ బాధలు మర్చిపోడానికే
బార్లలో నిండా మునుగుతున్నారు
నీ ఆకలికి తాళలేక
కోడి పులావులు మెక్కి కొవ్వెక్కుతున్నారు

ఇంత చేస్తున్నా
నీ కోసం తవ్వించిన బావిలో
నీవే దూకి ఆత్మహత్య చేసుకుంటావా ?
తప్పు ! తప్పు !
తవ్వించిన వాళ్ళకే బావిలో స్థానం
తలెత్తి నడిస్తేనే ముందు ప్రస్థానం.

 విశ్వనాథ సూర్యనారాయణ

# భావచిత్రాలు

ఏం పాపం చేసింది దీపం ?
పాపం ! ఎప్పుడూ చీకట్లో వుంటుంది
ఎంత అదృష్టం నీకు తిమిరం !
ఎంతో కొంత దీపంతో సహవాసం

*

నిరంతరం నీవన్వేషివైతే
గమ్యం ఎప్పుడూ కడుదూరంలో వుంటుంది
నిత్యం నీవు సత్యవ్రతుడవైతే
అబద్ధం నీ ఎదుటే అందెలు మోగిస్తుంది

*

ఆలోచనా దీపాలు
ఆజన్మాంతం వెలగనియ్యి
భావాల రూపాలు
బాగా కనపడనియ్యి
అప్పుడు మనిషిలో మానవుడుదయిస్తాడు
మానవత్వానికి భాష్యం చెపుతాడు

*

ఆలోచనల్నే అధిగమించలేని మానవుడు
అంతరిక్షాన్ని శోధిస్తున్నాడు
ఆత్మనే ఆవిష్కరించుకోలేనివాడు
అణువుని ఛేదించి రోదిస్తున్నాడు.

*

కదిలితే అవి కాళ్ళు
కదలకపోతే –
భూమిలో పాతుకుపోయిన వేళ్ళు

చూస్తే అవి కళ్ళు
చూడకపోతే -
మండే నెగళ్ళు

కలిసొస్తే అది కాలం
కలిసి రాకపోతే, తెగిన గాలం
గడిస్తే జీవనం అరక్షణం
గడవకపోతే -
యుగాల కొలదీ మరణం

*

అణ్వాస్త్రం కనిపెట్టినవాడికి
అణువణువూ పులకింత
అన్నమే దొరకని వాడికి
అనుక్షణం అదే చింత

*

చీకటి ఉదయించినపుడు
వెలుతురును శోధిస్తాను
వెలుతురు వెడలిపోతే
చీకటిని వేధిస్తాను
వెలుతురు చీకట్ల సంగమంలో
ప్రకృతిని మథిస్తాను
ప్రయోజనాన్ని విధిస్తాను

*

# జయప్రభ

పుట్టింది 1957వ సంవత్సరం, నాగపూర్‌లో. మనం తలపెట్టే ఏ ప్రక్రియ అయినా ప్రజలకి ఉపయోగపడాలని నా తలంపు. వ్యక్తుల బట్టీ కాక, వ్యక్తిత్వాలను బట్టీ విలువ నివ్వడం, మనసుని కదిలించే ప్రతీ దానికీ స్పందించడం - సృజనాత్మక మైన కవిత్వం ఎవరిదైనా నా ఇష్టమే. ఘంటసాల గానం అన్నా, చలం సాహిత్యం అన్నా అభిమానం. చేతనయినంత వరకు జీవితాన్ని చైతన్యవంతంగా, ప్రయోజనకరంగా గడపాలనే ఆకాంక్ష. స్నేహం అంటే ప్రాణం.

# కవితల క్రమం

# జీవనం

భూమి పుట్టిందగ్గర్నుంచీ
సృష్టి జరిగిందగ్గర్నుంచీ
క్రీస్తు పూర్వంనుండి క్రీస్తు శకందాక
రాతి నుండి ఇనుముదాకా
నాటి నుండి నేటిదాక!
డేంజర్లను దాటుకుంటూ,
ఢక్కా మొక్కీలు తింటూ
బ్రతుకుతూ, చస్తూ
చస్తూ బ్రతుకుతూ మానవ జీవనం!
వికసించిన నవనాగరికతా కుసుమ మధువనం!!

పరిణామాలను పరిశీలిస్తే
పది ఉద్గ్రంథాలు రాయొచ్చు
పబ్లిషర్లను పట్టుకుని అచ్చులో చూసుకోనూవచ్చు!
మారినదేమిటయ్యా అంటే
అప్పుడు పచ్చిగా తిన్నాం
ఇప్పుడు పచ్చిది వెచ్చగా కాల్చుకు తింటున్నాం!
ఆకులుకట్టాం, పట్టుగా తిరిగాం;
పట్టుని కప్పుకుని మడికట్టు కోవడం మాత్రం నేర్చాం!
పచ్చి ప్రేగుల్లో - మాంసపు పోగుల్లో పడిదొర్లినా
వాసన లేని వాళ్ళు - వాళ్ళు
ఉడుకులాంలో ఊరినా - వాసన వేస్తున్న వీళ్ళు

నాగలి పట్టినా - ట్రాక్టర్లు త్రొక్కినా
పడుతున్నది ఒకే అవస్థ!
ఏం మారింది ఈ వ్యవస్థ?
మనిషి మారేడు బాహ్యంగా
ఆడంబరంగా, నవనాగరికంగా

కానీ...
మనసు మాత్రం
సృష్టి పరిణామ దృష్ట్యా కాక
మనిషి నుంచి మృగం వైపు తిరోగమిస్తోంది.
విజ్ఞానం వెల్లి విరిసింది
కాలు కదిపితే నాకలోక భోగాలు
అన్నీ ఉన్న వాడికీ – అనుభవించే వాడికీ!
ఏమీ లేని వాడి గతి
ఏ యుగం నుంచీ ఒకే స్థితి

మన్వంతరాలు మారాయి
అంతరాలు పెరిగాయి
మనుష్యులంతా విడిపోతున్నారు
దేశాలుగా, రాష్ట్రాలుగా, ప్రాంతాలుగా,
చిన్న చిన్న బృందాలుగా, ఇంకా ఇంకాగా...
చివరికి మనిషిగా కూడా మిగలలేక పోతున్నారు!
కొట్టుకుంటున్నారు - చంపుకుంటున్నారు
సృష్టి అంతానికై పట్టు పడుతున్నారు
ప్రాక్పశ్చిమాలైనా - ఉత్తర దక్షిణాలైనా
అన్ని చోట్లా జరుగుతున్నది ఒకే కథనం

మారాలి మారాలి ఈ రకపు జీవనం!
మనిషికిక రావాలి రావాలి పునరుజ్జీవనం!!

# కరి మింగిన వెలగపండు

శాతవాహనుల శౌర్యప్రతాపాలు
ఇక్ష్వాకుల పాలనావైభవాలు
రెడ్డిరాజుల వీరవిక్రమాలు
కృష్ణరాయల పాండితీప్రాభవాలు
గతకాలపు సౌభాగ్యానికి తార్కాణాలు

బాగానే ఉంది !
మరి, వర్తమానం మాటేమిటి
రాజ్యాలు మారి ప్రజాప్రభుత్వాలుద్భవించాయి
రాజులు గతించి మంత్రులుగా అవతరించారు
కానీ, సామాన్యులు సన్నజీవాలై
బ్రతకలేక, చావలేక, అల్లాడుతున్నారు,
మా తాతలు నేతులు తాగారనే
డాంబికాలతో కాలం గడపటం
పాడిందేపాడి
మనమంత వాళ్ళమనీ, ఇంతవాళ్ళమనీ జేజేలుకొట్టుకునే
ఈ శుష్కప్రియాలు ఎవరికోసం ?
ఏ ఊసుల కళ్ళు కప్పటానికి
ఏ సామాన్యుల నోళ్ళు నొక్కటానికి

ఎంత సహనం ఈ ఆంధ్రులకి
గాలిమాటలనీ, చెల్లించని వాగ్దానాలనీ





నమ్ముకుంటూ
వ్యక్తులకి పట్టంకట్టి బాధలు పడుతూనే ఉంటారు
ఎంత మొహమాటం వీళ్ళకి ?
ఎన్ని అన్యాయాలు కళ్ళెదుటే జరిగిపోతున్నా
ఇదేమని నిలదీసి అడగరు ! !

కానీ—
ఇదే నిజమనీ, ఇదే నిత్యమనీ
ప్రజల సహనం మాటున
పబ్బం గడుపుకోవాలనే
నాయకులకిదొక హెచ్చరిక !

కడుపులు మాడ్చుకుంటూ పెరిగే పిల్లల్ని
కండలు కరిగించుకునే శ్రమజీవుల్ని
నిర్లక్ష్యం చేసినప్పుడు—
పట్టెడు మెతుకులకోసం
పరితపించే వాళ్ళున్నప్పుడు—
ఒంటినిండా గుడ్డలేక
కడుపులో కాళ్ళు దాచుకుని
చలికి వణికే దీనులని పట్టించుకోనప్పుడు—
క్షణక్షణం చావుగా పరిణమించే
భద్రతలేని బ్రతుకు ఇంకా గడపవలసి వచ్చినప్పుడు—
ఈ సహనాలూ, శాంతాలూ, అంతరించి
ఆంధ్రుల్లో ఆవేశం రగుల్కొక మానదు.
ఆంధ్రులు శూరులేకాని- ఆరంభశూరులన్నది అబద్ధం.
అది కొందరు సోమ్మరిపోతులకే స్వంతం
ప్రతి ఆంధ్రుడూ-చైతన్యభానుడే
అన్యాయాల నెదుర్కొనే విప్లవమూర్తి అతడు

రజతోత్సవ శుభసందర్భాన స్మరించుకోవలసింది
గతించిన రాజుల వైభవాలు కాదు
గతించని నిత్యజీవిత సమస్యలని;

రేపటి తెలుగు బాలల భవితవ్యానికి
నేడే పథకాలు అమలు జరపాలన్నదీ
నిరాశా నిస్పృహలనింకా నిరుద్యోగులలో పెంచవద్దన్నదీ-
కనీస అవసరాలు తీరి-శాంతిగా బ్రతుకుగడిస్తే చాలన్నదీ
ఇదే...ఇదే...ప్రతి ఆంధ్రుడూ కోరుతున్నది
కల్పించండి ముందు దీనులకు ముక్తి !
కన్పిస్తుంది అపుడు ఆంధ్రయశోదీప్తి ! !

# సూర్యుడు కూడా ఉదయిస్తాడు

అర్ధరాత్రి నిశ్శబ్దంలోంచి
మానభంగం చేయబడ్డ
మగువ ఆక్రందన
నీ గుండెను కోసినప్పుడు-

పాలకోసం
పసివాడి ఆకలిరోదన
నీ కంటనీరు చిందించినప్పుడు-

డబ్బుతో మొగుణ్ణి కొనుక్కోలేని
పేద యువతి సానిపాపగా మారిన
వేదన నిన్ను ప్రశ్నిస్తున్నప్పుడు-

ఫస్టు క్లాసులో పాసైనా
ఫీజు కట్టలేక కాలేజీలో చేరని
విద్యార్థి ఆవేదన
నిన్ను నిలదీస్తున్నప్పుడు-

బాధ్యతల బరువుతో వయసు ముదిరి
ఉద్యోగ అర్హతలని కోల్పోయి
ఉరిపోసుకున్న నిరుద్యోగి కన్నీటిగాథ
నిన్ను కదిలించినప్పుడు-

ఆకాశాన్నంటే ధరలతో
బ్రతకలేక చావలేక
నలిగిపోతున్న ప్రజల నిస్సహాయత్వం-
డబ్బుని గుప్పిట్లో అదిమి
దర్పం చూపే ధనికస్వాముల హుందాతనం
అక్రమ రవాణాలతో
అధిక మౌతున్న నల్లధనం
ప్రజలను దోచుకునే గూండాతనం

నిన్ను కలిచి వేస్తున్నప్పుడు-
కలవర పెడుతున్నప్పుడు-
మౌనం దేనికి ?

అణగని ఆవేదనని నిట్టూర్పుల్లో
అణచాలని చూడకు;
రగులుతున్న ఆవేశాన్ని ఆరనీయకు;
చైతన్యపు తూరుపులా ప్రజ్వరిల్లు !
అప్పుడు-
బిగిసిన నీ పిడికిలి మాటునే
సూర్యుడు కూడా ఉదయిస్తాడు ! !

# కనువిప్పు

కళ్ళు మూసుకుని
చీకట్లో జీవిస్తూ
వెలుతురనేది లేదనుకునే వ్యక్తికి
కనువిప్పు కలిగితే గాని
వెలుగు కనపడదు
వ్యక్తిత్వం బయటపడదు. .

అయితే......
కళ్ళు తెరవాలంటే
కలగాలి అనుభవాలు !
జీవితంలో తటస్థించే
సంఘటనల రాపిడికి
మనసు నలిగితే
మత్తు వదిలించుకుని
చుట్టూ సంఘాన్ని గమనించి
తన స్థానం గ్రహించి
అహంకారం వదలితే
అహమేమిటో తెలుస్తుంది

తనేమిటో తెలుసుకున్నవాడు
లోకమేమిటో తెలుసుకోగలడు
పీడిత ప్రజానీకంచేత
పిడికిళ్ళెత్తించగలడు !!

# ప్రవాహం

యుగ యుగాల
చారిత్రక పరిణామాల మూలంగా
మానవజీవిత పరీవాహప్రాంతాల
శరవేగంతో ప్రవహిస్తున్న
నాగరికతా ప్రవాహం
ఏ ఆనకట్టకీ ఆగటంలేదు !

అది ప్రవాహ లోపం కాదు.
తనదారిన ఉండే మంచినీ, చెడునీ,
తనలో కలుపుకుని
గమ్యానికి సాగిపోవటమే
ప్రవాహ లక్షణం !

కానీ...
మంచిని మైదానంలో నిలుపుచేయకుండా
సముద్రంపాలు చేయటం
మానవత్వం కాదు.
ప్రవాహానికి ఎదురీది
పనికివచ్చేది అల్పమైనా
కాపాడుకోవాలి !

లేకపోతే—

తరాల చారిత్రకాధారాలే నాశనం కావొచ్చు !

మానవ సంస్కృతే మట్టిలో కలవొచ్చు !

అడుగు బ్రతుకుల బడుగుజీవుల జీవితాలను

నాగరికతా ప్రవాహపు వరవడిన

కొట్టుకు పోనియ్యకూడదు.

నాగరికత మంచిదే

పురోగమనానికది ప్రతీకే—

కానీ...అది ఏ ఒక్కరి స్వంతమూ కాదు

ధనమున్న బడాచోర్‌ల కాలిక్రింది చెప్పు కాదు

తరాల మానవ సంస్కృతి వికాసంలో జనించిన

చైతన్య స్రవంతి నాగరికత !

విలాసాల, విందుల వరవడినుంచి

జాతిని జాగృతం చెయ్యాలి

ప్రవాహపు వేగం

ప్రక్కదారి పట్టకుండా

మానవత్వంతో మలుపు త్రిప్పుకోవాలి !!

# నువ్వు చూస్తావు

నిజంచెప్పు -
నువ్వు చూసేవు కదూ
ఆకలితో చచ్చి పోయిన అర్భకుని శవాన్ని !
కానీ ... కదిలి పోయేవు
స్వార్థం ముసుగు వేసుకుని,

నువ్వు చూసేవు
బలవంతంగా చెరచబడ్డ
బలిపశువు లాంటి ఆడదాన్ని,
కానీ ...మారు పలుక లేక
పిరికితనపు మాటున దాక్కున్నావ్.

నువ్వు చూసేవు -
లంచాలు పుచ్చుకుంటూ
లక్షల కధికారులవుతున్న వాళ్ళని
కానీ... ఖండించే సాహసం లేక
వారినే సమర్థించేవు.

నువ్వు చూస్తున్నావ్ సామాజిక అవినీతిని
చేయి కలుపు తున్నావ్ దుష్టశక్తులతో
కానీ ... పలుకు తున్నావ్ ధర్మపన్నాలు
చెపుతున్నావ్ శ్రీరంగ నీతులు

ఇక ఈ సమాజం బాగుపడదంటూ
నిట్టూర్పులు విడుస్తున్నావు

కానీ -
నీవు చేయి కలిపే దుష్టశక్తులు
చివరకు నిన్నూ చుట్టుముడతాయి
ఆనాడు నీవు ఒంటరివి అవుతావు

అందుకే
నీతో కలుపుకో నిరుపేదలని
నీలో శక్తి నశింపనంత వరకూ
నీలో మానవత్వం పెల్లుబికేలా
నీ ఆఖరిక్షణం ఆసన్న మయ్యేంత వరకూ
నిండు మనసుతో ప్రవర్తించు
సవాలుతో చెడు నెదిరించు
అప్పుడు -
నీ వెనుక కోటి శక్తులు
నీకు చేయూత నిస్తాయి
అప్పుడు నువ్వు చూస్తావు
అమృతపు బ్రతుకులని
అసలైన సమాజాన్ని !!

# మధ్య తరగతి మందహాసం

ఫస్టు తారీఖు
నాల్గు వందలు నింపుకున్న జేబు
నిండుగా నవ్వింది
మనసులో తృప్తి - నడకలో ఠీవితో
రాజులా - గృహసామ్రాజ్యానికి బయలుదేరాను,

మనసులో ఒక చిలిపి ఊహ, ఎప్పటిదో—
శ్రీమతికి బహుమతి కొనాలని,
ఈ నెల బంధువుల రాబందులు లేరు
మందుల బిల్లులూ లేవు
అందుకే కొంచెం హుషారుగా
బజారులో అడుగు పెట్టాను
అందమైన చీరతో షోకేసులోని అపరంజి బొమ్మ
కళ్ళకు కైపెక్కించి శ్రీమతిలా అన్పించింది
ఆ చీరలో నా సతిని ఊహించుకుని
చీర కొనబోయి అడిగేను ధర ఎంతని ?
ఆదరంగా ఆహ్వానించి
చావు కబురులా చల్లగా చెప్పేడు
రెండు వందలు మాత్రమే నని

మందమైన హాసంతో షాపు నుంచి
బయట పడ్డాను.
నా జీతంలో సగమిస్తే - నా కోరిక తీరుతుంది
నెలలో రెండు వారాలు పస్తుంటే
అస్థిపంజరాన్ని కప్పుకుని - కొత్తచీరలో
శ్రీమతి అప్సరసలా కనబడుతుంది
వరుసగా అన్ని షాపులు చూస్తున్నాను

రండిసార్ ! రండి... చూడండిసార్ !
ఇది కొత్త మోడల్...
ఇదే లేటెస్టుసార్ ! కొనండి మీ శ్రీమతికి
ఇదే ఇప్పుడు మోడరన్ సార్ ! తీసుకోండి మీ ప్రియసతికి
ఎన్నో వస్తువులు... ఎంతో అందమైనవి
ఆడవారికి తగినట్లు అతి నాజూకైనవి... ముచ్చటైనవి,
కానీ, ధర - వస్తువులా
అందంగా, నాజూకుగా, ముచ్చటగా, చౌకగా లేదే ?
విలువైనవి అనుకున్నవి అందుబాటులో లేవు
నిరాశగా వెను తిరిగాను

తీసుకోండి సార్ ! తీసుకోండి
మల్లెపూలు సార్ !
అందమైనవి; నాజూకైనవి; ముచ్చటైనవి, చౌకైనవి,
అన్నింటికీ మించి
స్వచ్ఛమైన భావంతో ప్రేమ పరిమళాలు విరజిమ్ముతూ
ఎంతో విలువైనవి !
చటాకు పావలా ! మల్లెపూలు తీసుకోండి సార్ !
పూవులు కొన్నాను
మల్లెలో సిరిమల్లెలాంటి శ్రీమతిని ఊహించుకొని
ఇంటికి చేరి జడలో పూలుంచుతూంటే
హసించింది శ్రీమతి మామూలుగా
ఓస్ ! ఇవేనా-ఇంతేనా ?
అన్నట్లు లేదు ఆ నవ్వు,
ఇవే మనకు విలువైన కానుకలు అన్నట్లుంది.
నేనూ నవ్వాను
కానీ——
''పావలా మల్లెపూలతో
మొదటి వారమంతా వెదజల్లబడే
ఈ 'మంద' హాసాలు
కనీసం చివరి వారానికి కూడా ఉండగల్గితే ! !

# నేను

నిశ్శబ్దపు అంచున
కాంతిపుంజపు వెల్లువనై
అవని నాక్రమిస్తున్న
తొలివేకువ నౌతాను

మట్టిని చీల్చివస్తున్న మొలకను
మరో చైతన్య స్రవంతికి ప్రతీకను

లేదు నాకు సంకుచిత కులమతాల వారసత్వం
ఉంది నాకు సమసమాజంలో పౌరసత్వం
ఛాందసాన్ని గర్హించటమే కాదు నా ధ్యేయం
సమతత్వానికి నాంది కావటం నా ఆశయం

ఈ సమరంలో రాలినా ఓడిపోను నేను
మరో జ్యోతిగా మరు నిముషంలో అవతరిస్తాను.

# కాలం

అణు విచ్ఛేదనంతో
సృష్టి ప్రారంభమైందన్న
హేతువాదుల తర్కానికీ
ఆది దంపతుల ప్రేమసాఫల్యాన
ప్రకృతి విస్తరించిందన్న
భావవాదుల జిజ్ఞాసకీ
మూలమేమిటో కాలానికి మాత్రమే తెలుసు !

ఏ ఇజాలలోని నిజాలకైనా
సాక్ష్యాధారం కాలమొక్కటే
అయితే అన్నీ తెలిసిన కాలం
గళం విప్పదు – గతిని తప్పదు
గాలానికి–చిక్కదు.

కాలం జరిగిపోతూ వుంటుంది
మనిషిలో ప్రశ్నలను రగిల్చి -
కాలం కరిగిపోతూ వుంటుంది
సమాధానాలను మిగిల్చి -

కానీ, అంతుపట్టని ఈ కాలం
ఆగిపోని ఈ కాలం
మానవుని మేధామండలంలో
నింపలేని ఒక 'కాలమ్.'

# జీవితాదర్శం

పుట్టిపాపగా కళ్ళుతెరచి
తల్లి వెచ్చని స్పర్శలో సేద దీరి
తీయని చనుబాలతో పెరుగుతున్న
బుజ్జి పాపాయికి లేదు ఆదర్శం !

ఆదర్శానికి - ఆచరణకి తేడా లేకుండానే
హాయిగా జీవితాన్ని ఆటలాడుతూ గడిపే
పసి బాలుడికి లేదు ఆదర్శం !

పట్టెడు మెతుకులు విదిలిస్తే పుట్టెడు విశ్వాసంతో
యజమాని జీవితానికి కాపలా కాస్తూ
ప్రాణాన్ని పరమానందంగా ఇచ్చేయగల
కుక్కకి లేదు ఆదర్శం !

బుద్ధి వికసించిన కొద్దీ
సంఘంలో స్థానం కోసం
హోదా కోసం; హాబీగా కావాలి
కావలసినన్ని ఆదర్శాలు

పేపర్లో ప్రకటించుకుందికీ
పరపతి సంపాదించుకుందికీ
ప్రజల నెత్తిన ఆదర్శాల పేరుతో
బాధ్యతల బరువు నెట్టడానికి - కావాలి
వినాయకులకు వెరైటీ ఆదర్శాలు

కానీ—రేపు ఎలాగడుస్తుందో
చింతలేని అల్పసంతోషికి
లోక మేమిటో ఎరుగని అమాయకుని కి
తను చేయగలిగిన దంతా
ఎదుటి వాడికి నిస్వార్థంతో చేసే
ప్రతిఫల మాశించని అనాగరికునికి లేదు ఆదర్శం

వాడి జీవితమే ఆదర్శం !
కానీ, వాడికి తెలియదు వాడి జీవితాదర్శం !!

# జ్వలిస్తూ!

చుట్టూ చీకటి మింగుతూన్న గుడ్డి వెన్నెల
నిశి నివురు గప్పిన నిప్పులా వుంది.

ఏ క్షణాన ప్రజ్వలిస్తూ తనను స్వాహా చేస్తుందోననే
భయంవల్ల కాబోలు పున్నమి చంద్రుడు
చిక్కటి నల్లమబ్బుల ముసుగులో తప్పుకున్నాడు
ఇంకేం
చీకటి చంద్రుడిని ధిక్కరించి
ఆర్యకాలంలో సామ్రాట్టులా
అవని అంతా ఆక్రమిస్తోంది.

ఆ సమయంలో
నేను— ఒంటరిగా, బుద్ధిదీపపు కాంతిలో...
నాగదిలో...
గతానుభవాల పరిష్వంగంలో
సుఖదుఃఖాల చుంబనాలతో
మునిగి తేలు తున్నాను.

ఎన్నెన్ని అనుభవాలు...!

జీవితపు అట్టడుగు పొరలలో
తప్పి పుచ్చినా కదలి వచ్చే నిజాలు
జీవితమే చాలా చిన్నదంటారు
అందులో యవ్వనం అతి స్వల్పం అయితే
గడచిన జీవితం స్వల్పంలో స్వల్పం

గడించిన అనుభవం
జీవిత గమనానికి కరదీపికలా సాగుతోంది.
అంతరంగ మథనంలో అనుభవాలు
హాలాహలంలా, అమృతంలా ఉరకలెత్తుతున్నాయి

శివుడంతటి నిగ్రహమూ నాకు లేదు,
గరళాన్ని గళంలో నిల్పుకొందుకు.
దేవతలంతటి స్వార్థ పరత్వమూలేదు
అమృతాన్ని ఆస్వాదించి
హాలాహలాన్ని విసర్జించటానికి.
అందుకే
ఆలోచనల రాపిడిలో
నలిగి పోతున్నాను సామాన్యురాలిలా !

చీకటి వికటాట్టహాసం చేస్తోంది
దానికి తలవంచలేదని కాబోలు !
దాని ఆర్భాటానికి బుద్ధిదీపం రెపరెపమన్నా
చంద్రునిలా చెదిరిపోలేదు
ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకుంది.

బెదరని నన్ను కదిలించబోయింది చీకటి
కానీ, అంతరంగపు వెలుగులో పయనిస్తూ
జీవితంలోని ఆటుపోట్లతో
కరడు కట్టి పోయిన మొరటు మనిషిని
ఈ చీకటంటే నాకేం లక్ష్యం ?
నా లక్ష్యం వేరు !
జీవితంలోని ఒడుదుడుకులకి అతీతంగా
లోకంలో
పుచ్చిపోయిన చచ్చు నమ్మకాల చీకట్లను
చీల్చుకుంటూ పోవాలి
జ్వలిస్తూ ! ప్రజ్వలిస్తూ !!

# సంధ్యాదృశ్యం

అరుణ వర్ణాన్ని ఆకాశమంతా అలిమి
అదృశ్యమై పోయింది సూర్యబింబం
కెంజాయకే కంది నీలితనాల్ని నేలపైవదలి
ఎరుపెక్కి పోతున్నాయి మేఘ మాలికలు
శ్యామ వర్ణాన్ని కోమలంగా గైకొని
తూరుపు శిఖరారోహణం చేసే శైలరేడు
సొగసులకి సెగరేపు తాడనేమో ! మరి,
జలతారు మేలి ముసుగేసుకుంది పృథ్వి !
పశ్చిమాన సంధ్యారాగం వీడక ముందే
ప్రాగ్దిశ జ్యోత్స్నా పూరితమై పోయింది
వెన్నెల ప్రభావంతో ఎరుపు తనాన్ని వదలి
పాల మేఘాలు శాంతి దూతల్లా అంబరాన సాగి పోతున్నాయ్
తళుకు చుక్కలు దారి చూపుతుంటే
రానే వచ్చాడు చంద్రుడు !

కిరణాల తాకిడికి, వేసుకున్న వల్లెవాటు కరిగిపోగా
తనలోని అందాలు పాలకాంతిలో ప్రతి ఫలిస్తూంటే
సుధాకరుని మృదు చేష్టలకు తాళలేక
ప్రణయానికి లొంగి పోయి
చాచిన వెన్నెల హస్తాన్ని
ప్రేమ భావాన పెన వేసుకుంది ధరణి

సూర్యుడు కూడ ఉదయిస్తాడు

# నిశ్శబ్ద సంచలనం

ఎవరూ లేని ఏకాంత వేళ
మధురోహలు రొదపెడుతూంటే
ఆవరించిన నిశ్శబ్దం అమృతంలా ఉంది !

ఎంత నిశ్శబ్దం ! !
ప్రపంచమంతా ప్రళయాంబుధిలో
మునిగిపోయి
సమస్త ప్రకృతినీ నాకే
ధారాదత్తం చేసినట్లుంది !
నీలి ఆకాశాన తెల్లని మేఘాలు
దూది పింజలై తేలిపోతుంటే
సూర్యుని నీరెండ మబ్బుల గుంపుమీద
మల్లె కాంతితో పడుతుంటే
పాలకడలి పొరలి పొరలి పొంగుతున్నట్లుంది !

ఇప్ప పూచీర సింగారించిన భూమి
వన కన్యలా ఉంది !
కిచ కిచమనే పిచ్చుక కేరింత
ప్రకృతి పెళ్ళికి బాకాలా ఉంది !
సమీపాన ప్రకృతి కోలాహలం కవ్విస్తూన్నా,
స్వార్థజీవుల సంచలనం లేక

పటాటోప ప్రతిధ్వనులు లేక
ప్రశాంతంగా... లోకం నాకంలా ఉంది!
శాంతి కపోతంలా ఉంది!!
అంతులేని ఈ నిశ్శబ్ద వాహినిలో పడి
ఇలా ఎన్నో యుగాలు ప్రవహించాలని ఉంది!
ప్రకృతిలోని పూర్ణ సౌందర్యాన్ని
స్పృశించి పరవశించే... మలయ పవనంలా...
శూన్యమంతా నేనై నిండాలనుంది!

చెట్ల ఆకుల పుట్టి వెదలిన
పక్షి కూజితాన్నై
భువన భువనాల మార్మోగాలని ఉంది!
రంగుల పూరేకుల పరిమళాలు విరజిమ్మి
పూతేనెతో తేటి నలరించాలని ఉంది!
ప్రకృతికే అలంకారాన్నై
పరవశించి పోవాలనుంది!
ప్రకృతిలోని ఒక రేణువునై
కలిసిపోవాలనుంది

నా చిన్ని హృదయాన ఇమడలేని
ఈ ఆనందాతిశయంతో తపించలేక
ఈ అనంతానుభవాన్ని ఆస్వాదించలేక
ఈ నిశ్శబ్దంలో కలిసిపోవాలనుంది
ఈ నిశ్శబ్దాన్ని నేనై నిలిచిపోవాలనుంది!!





# వ్యక్తీకృతం

అస్పష్టమైన ఆలోచనలు
సముద్రపు కెరటాలై ఎగిసి పడుతున్నాయి !
నిశ్శబ్దాన మౌన రాగంతో
మనసు ఆనందాన్ని ఆలాపిస్తోంది.
ఆ ఆలాపనతో నా భావాలు
ఉదాత్త స్వరాలతో ఉరకలు వేస్తున్నాయి.

ఎగిసి పడే ఆలోచనా తరంగాలు
చెలియలి కట్టతో అంతాన్ని చేరుకుంటున్నాయి !
కానీ...కొత్త అలలు పుడుతూనే ఉన్నాయి
భావ పరిసమాప్తి జరగటం లేదు.

శక్తికి మించిన అనుభూతిని
వయసు భరించలేక పోతోంది
సున్నితమైన హృదయం
ఆనందానికీ... ఆవేదనకీ...
చలించి పోతోంది.

బహిర్గత మౌతున్న భావవీచికలు
నిశ్శబ్దంలో కలిసి పోతున్నాయి
ఆదర్శాలు నా ఆచరణకి ఆలంబన మౌతున్నాయి

అవ్యక్త వైఖరితో ఆరంభమైనా
అచంచల మైన దీక్ష
స్థిరత్వానికి పునాది అవుతోంది.
ఆత్మజ్యోతి సాక్షాత్కారంతో
హృదయం పులకిత మయ్యింది ! !

# శంఖారావం

నేల మట్ట మవబోయే
పూరి గుడిసెలో నుండి
అప్పుడే ఉదయించిన
పసి బాలుని కసి రోదన
వెల్లువలా ప్రవహించి
వేగంగా ప్రసరించి
ప్రళయకాల శంఖారావమై
దిగంతాలలో వ్యాపించి
చీకట్లలిమిన లోకంలో
కాంతి బాట ఏర్పరచింది-

ధన మదాంధులను కబళించి
నిర్ధనులకు నీడను కల్పించి
నిస్సహాయులైన నిరుపేదల
బ్రతుకున నూతన కాంతిని తెచ్చింది -

నల్ల బ్రతుకుకొక సవాలుగా
న్యాయ హీనతకు జవాబుగా
నవలోకానికి నాందిని పలికి
భావి తరానికి స్వాగతమిచ్చి
బ్రతుకులో ఆశను కల్పించి
నిద్రలో మునిగిన లోకాన్ని
వెన్ను తట్టి మేల్కొలిపింది.

# మృత్యుక్షణాలు

ప్రపంచానికి జీవంలా—
ప్రవహిస్తున్న వేడీ, ప్రసరిస్తున్న వెలుతురూ
మసకేస్తున్నాయి.
ఉషస్సుతో జన్మించి
మాధ్యాహ్న యవ్వనపు మిసిమిని చురుకుమనిపిస్తూ
వృద్ధాప్య సాంధ్యవేళలో
ప్రశాంతిని పొందిన
సూర్యుడు అస్తమిస్తున్నాడు

సంధ్యానాడి ఆగిపోతోంది
రక్తవర్ణం మరుగు పడుతోంది
ఆ మృత్యు క్షణాల్లో,
బాల్య, యవ్వన, వృద్ధాప్య
అనుభవాధిరోహణంలో
ఆకాశపు ఆఖరి అంచున
అస్తమించే సూర్యబింబం

ఆక్రమిస్తున్న మృత్యు అంధకారంలో
గాలివాటు దీపంలా లోకం.

# దీపం

తిమిర రాక్షసి కోరలు పీకే
సమర సాహసి దీపం !
నిరాశామయ జీవితంలో
మినుకుమనే ఆశా కిరణం.

అజ్ఞానపు కడలిలో
అంకురించిన జ్ఞానతరంగం
రాతియుగంనుంచి-యంత్రయుగానికి
మనిషి పొందిన మార్పుకి చిహ్నం.

వ్యక్తి హృదయంలోని
సంకుచిత తాపం
కరిగించి వైశాల్యమొందించు దీపం.





# రక్తతర్పణం

అమ్మా ! భారతమాతా!
ఎండిన పాలిండ్లనుంచి
స్తన్యం రాక
రుధిరపానం చేస్తున్నాడు
ఈ భావి భారత బాలుడు

స్వార్థ రాజకీయాలతో
పదవీ కాంక్షతో
ఈ వయసు ముదిరిన ఊసరవెల్లులు
నిన్నే శృంఖలాబద్ధను చేయదలిస్తే
మరో స్వాతంత్ర్య సమరంలో
నీ కోసం
రక్తతర్పణం చేయడానికి
వాడి శరీరంలో కావలసినంత రక్తం.

# నా దేశంలో స్త్రీ

ఈ విజ్ఞాన యుగంలో కూడా
ఇంకా పెను చీకటిలోనే మ్రగ్గుతున్న
నిర్భాగ్యులారా !
అలవాటుగా వంచిన తలని
ఎత్తలేక పోతున్నారు
శతాబ్దాల దోపిడికి
ఇంకా గురి అవుతూనే ఉన్నారు.

పెద్దవాళ్ళ నిర్ణయాలని
ఎదిరించే సాహసం లేక
మౌనంగా తలవంచి
మానసిక రోగాలతో
ఘోరమైన జీవితాలను గడుపుతూ
బ్రతకలేక, చావనూలేక
సంస్కారం పేరున
ఈ సంఘపు 'మాన్ ఈటర్'కి
బలిదానం అవుతున్న అమాయకులారా !
మీ శక్తి యుక్తులని
వ్రతాలతో, నోములతో, ఒంటి పొద్దులతో
వ్యర్థంగా ధారపోసే ఈ త్యాగం ఎవరికోసం ?

వ్యసనాలే వ్యక్తిగా రూపుదాల్చి
చెడిపోయిన త్రాగుబోతు భర్త కొఱకా ?
మంచి చెడుని మరచి పోయి
పెళ్ళాం పిల్లలని పశువుకన్న హీనంగా చూస్తూ
నరకాన్ని పంచి ఇచ్చే
జూదమాడు ప్రబుద్ధుల కొఱకా ?
ఎందుకీ సహనాలు ? ఎందుకీ త్యాగాలు ?
అల్పులకోసం చేసే అపాత్రదానాలు !

సంస్కారవంతులుగా చెలామణీ అవుతూ
ఇంటిలోని ఆడదానికి
నాలుగ్గోడల మాటున ఘోషాని విధించి
బ్రతుకంతా బూది చేస్తే
అటువంటి వ్యక్తితో జీవితం
క్షణక్షణం మరణమని
పెళ్ళి చేసిన పెద్దలకి
మొరపెట్టుకుంటే
నీ స్థానం అక్కడేనని
పతి ప్రత్యక్ష దైవమని
నీతుల గోతుల్లో త్రోసి
చేసిన ఘనకార్యానికి చేతులు విదిల్చికొని
చేతులారా కన్నబిడ్డ జీవితాన్ని
కసాయివాడి చేత పెడితే
ఎదిరించే చొరవ లేక
చదువుకునే తెలివి లేక
పొట్టపోసుకొను మార్గమేమో తెలియక
చావుకన్న మరో దారి లేక
ఆత్మహత్య చేసుకునే దీనులారా !

కట్నమిచ్చు శక్తి లేక
కన్యగా ఉండిపోలేక
పెళ్ళి కన్న వేరే పరమార్థం లేదని
ముతకయినా ముసిలయినా
మొగుడుంటే చాలునని
మూడు ముళ్ళ పలుపుతాడు
ముడి వేసుకు సాగిపోవు అబలులార !

పెళ్ళి జరుగు దారి లేక
కన్న వారి పాలిట
గుది బండగ మిగలలేక
జీవితాన్ని బంగారు స్వప్నంగా గడపాలని
బయట ప్రపంచంలోకి
స్వేచ్ఛా విహంగంలా ఎగరాలని
ఇల్లునీ పల్లెనీ విడిచి
సాలెగూట్లో ఈగ లాగ
సాను లింట చిక్కుపడి
కలలన్నీ కరిగిపోతే
కన్నీరొక నది కాగా
బయట కొచ్చే దారి లేక
బ్రతుకంతా హీనంగా
పడుపు వృత్తికి అంకితమవుతున్న
అక్కలార! చెల్లెలార! అమాయకులార!

సహజమైన వయసులోన
ప్రకృతి సిద్ధమౌ వరంవలన
కన్నతల్లిగా మారిన కన్నె పిల్లలారా,
పసి బిడ్డని ప్రేమతో
పెంచుకునే అవకాశమీయని
మాటలతో పొడిచి చంపు రాబందుల మధ్య

బ్రతుకుని గడపలేక
తల్లులయిన భాగ్యాన్ని, నేరంగా మోస్తూ
తలవంచుకు సాగిపోవు
ఓ మాతృమూర్తులారా !

శృంఖలాలు త్రెంచుకుని
అంధకారం చీల్చుకుని
తరాలుగా తరతరాలుగా
మిమ్మల్నణిచి, మీస్వేచ్ఛను దోచుకున్న
సంఘపు దౌర్జన్యంపై
తిరుగు బాటు చెయ్యండి ! తలలెత్తుకు నడవండి !
మీ గతం ప్రబోధ గీతమై
భావితరపు హృదయాల్లో
నినదించి పోవాలి !

విద్యావంతులు మీరై,
విజ్ఞానపు బాటలోన కరదీపికలై
మీ ప్రాపున పసివాళ్ళను
చైతన్యపు కిరణాలుగ
జాతికి అందించండి !
ఈ దేశం మీది - ఈ ప్రపంచం మీది
వికసించిన ఈ పూలు
పరిమళించు ఈ గాలి
చైతన్యపు ఉషస్సూ
ఇవన్నీ మీ కోసం !
అందుకే ఉద్యమించండి
తరాల బానిసతనపు
చీకట్లనిక చీల్చరండి
ఉషోదయ మయ్యిందిలెండి !